శ్రీ

# రఘురామశతకము

ఇది

విశ్వబ్రాహ్మణులు కడియాల సత్యనారాయణకవిచే

రచియింపంబడినది

మొదటికూర్పు 500 [illegible]

VIZIANAGRAM

**Price** ] A. P. Works [ **0-2-0**

1925

# పీఠిక.



ఆర్యులారా !

శ్రీరఘురామశతకము మిక్కిలి గూఢార్థము గాకుండునటులను పెద్దలకు పండితులకేగాక చదువరులగు బాలురకుగూడ సుకరముగా నర్థబోధ్యంబగు నటుల కందపద్యములచే రచియించి నాను.



# శ్రీ రఘురామ శతకము.

క॥ శ్రీ మద్రవికుల వార్నిధి
సోమా! రిపుసైన్యభీమ • సురుచిరనామా
హేమకుమాయోధ్యపుర
సీమా!సుగుణగణధామ • శ్రీరఘురామా॥ 1

క॥ నీపేర నొక్క శతకము
నేపలరగనే రచించి • యెంతయుబ్రీతిన్
నీ పాదయుగసమర్పణ
చే పరిపూర్ణుండ నగుదు • శ్రీరఘురామా॥ 2

క॥ పరమాత్మా • చిద్రూపక
సురపూజిత నళిననేత్ర • శోభితగాత్రా
పరమోపకార శుభకర
స్థిరముగ నావేల్పవీవె • శ్రీరఘురామా॥ 3

క॥ నిరుపేద నైన దీనుడు
పురుహాంబగు ద్రవ్యరాశి • బొందినమాడ్కిన్
ఉరుకలుషాత్ముడ నగు నే
స్థిరమగు నీపాత్రుగంటి • శ్రీరఘురామా 4

క॥ మందారహార తారక
చందన కర్పూర • సారసారసకీర్తి
వందారు జనవశీకర
బృందారక కోటిధామ • శ్రీరఘురామా॥ 5

క॥ మత్తుడ దీనుడ జడుడను
విత్తపరాయణుడ • నప్రవీణుడ కలుషా
యత్తుడ నజ్ఞుడ నిక నీ
చిత్తము ననుబ్రోచువల్ల • శ్రీరఘురామా॥6

క॥ క్రితుభుజులైనను ద్రిగుణా
న్వితమగు నీమహిమదెలియ • నేర్తురె దేవా
గతినీవె నన్నుగావర
శ్రితజనమందారధీర • శ్రీరఘురామా॥ 7

క॥ అక్షీణ ప్రావీణ్యం
బిక్షోణిని వెలయునెపుడు • గృపశిష్టుల సం
రక్షింపను వడిదుష్టుల
శిక్షింపను గర్తవీవె • శ్రీరఘురామా॥ 8

క॥ ఓ దాక్షిణ్య మయాత్మక
యోదిక్పాలక వినోద • యోదాశరథీ
యోదీన దయాంబుధియో
శ్రీదాయక పాహిపాహి • శ్రీరఘురామా॥9

క। ఓ వాంఛిత జనకల్పక
యోవీర నిశాచరేంధ • నోగ్రజ్వలనా
యోవాసవ పూజిత యో
శ్రీవల్లభ గావు గావు • శ్రీరఘురామా॥ 10

క॥ ఓయమర లోకవందిత
యోయఖిలజగత్ప్రమోద • యోసర్వమయా
యో యాపద్బాంధవయో
శ్రేయాఢ్యా రిపువిరామ • శ్రీరఘురామా॥ 11

క॥ ఉద్ధారకుడవు నీయెడ
బద్ధులునై బ్రీతినీదు • పదయుగభక్తి
శ్రద్ధాత్ములైన జనులకు
సిద్ధించును కార్యచయము • శ్రీరఘురామా॥12

క॥ అంతర్యామిని శ్రితజన
సంతానుని భక్తలోక • సంత్రాణుని శ్రీ
కాంతుని శాంతు ననంతుని
జింతించెద నిన్ను నెపుడు • శ్రీరఘురామా॥13

క। రామహరే పాపభయ వి
రామ దయాంభోనిధే • ధరావల్లభ యో
భామా ప్రశస్యనామా సు
శ్రీమత్కర దివ్యనామ • శ్రీరఘురామా॥ 14

కం॥ లోకంబులు గల్పింపను
బ్రాకటముగ బ్రోచుటకును • లయ మొనరింపన్
లోకేశుడ వచ్యుతుడవు
శ్రీకంఠుడవీవె యరయ • శ్రీరఘురామా॥ 15

కం॥ దేవా! రాక్షస కులవన
దావా కారుణ్యభావ • ధైర్యగ్రావా
పావననామా త్రిభువన
సేవితవర పాదయుగ్మ • శ్రీరఘురామా॥ 16

కం॥ గుణగణ రత్నస్తోమా
రణభీమ ప్రచురనామ • రాజన్మణి భూ
షణచయ ధామా బ్రహ్మ
త్రిణయన వినుతప్రణామ • శ్రీరఘురామా॥

కం॥ వరదా సుజన వినోదా
సురరాడ్భవ వినుతపాద • సూనృతవాదా
పరిజన రక్షణమోదా
చిరతర కరుణాప్రసాద • శ్రీరఘురామా॥ 18

కం॥ రారా ప్రోవగ రఘుకుల
వీరా జగదేకశూర • విమలాకారా
ధీరా స్త్రీజనమారా
శ్రీరమణీ హృదయచోర • శ్రీరఘురామా॥ 19

క॥ రారా కౌసల్యాసుత
రారా దశరథ కుమార ◆ రారా శౌరీ
వే రా బలమందున స
చ్ఛౌరీ ము ల్లోకములన ◆ శ్రీరఘురామా॥ 20

క॥ శ్రితజన పోషణదక్షా
యతులిత కరుణారసాక్ష ◆ యుతనుసదృక్షా
సతతనివేశన మోక్షా
శితికంఠేంద్రాదిపక్ష ◆ శ్రీరఘురామా॥ 21

క॥ శ్రీసతి మండితవక్షా
వాసవ వరపక్షశిక్ష ◆ పాండవపక్షా
వ్యాసాది మానిరక్షా
శ్రీ సంపత్కరకటాక్ష ◆ శ్రీరఘురామా॥ 22

క॥ మోదమ్ములు కల్మషచయ
భేదమ్ములుఁ బుణ్యమంత్ర ◆ వేదమ్ములు నీ
పాదస్మరణమ్ములు సు
శ్రీదమ్ములు మా కనెపుడు ◆ శ్రీరఘురామా॥

క॥ పాపపుబనులకొనై బేరి
కేపింపక నామనంబు ◆ బ్రియమారగనీ
రూప బ్రివిమలయోగ
శ్రీపూర్ణతనుండనిమ్ము ◆ శ్రీరఘురామా॥ 24

క॥ వాసవవందిత చరితా
వ్యాసమునీంద్రాదివిహిత • భంజితదురితా
దాసోహంతవ దైవా
గ్రేసరనుతపాదపద్మ • శ్రీరఘురామా॥ 25

క॥ ఖేటకమూషా భయదవ
నాటకదాటకవధించి • యతిరాడ్క్రతువున్
బాటించి మేటిరక్కసి
జేటుల వారించితౌర • శ్రీరఘురామా॥ 26

క॥ చేతోమోదంబందుచు
ఖ్యాతిగమరిశివునివిల్లు • ఖండించిమహీ
జాతను సుగుణోపేతన్
సీతను పెండ్లాడినట్టి • శ్రీరఘురామా॥ 27

క॥ ఇమ్మా వరములు వేడ్కన్
రమ్మా నను బ్రోచుటకును • రయమునను తిగై
కొమ్మా వందనము చెలే
లెమ్మా గల్మషవిరామ • శ్రీరఘురామా॥ 28

క॥ ముక్కంటియనుగు జోడా
డక్కనినెమ్మోమువాడ • సాములరేడా
నక్కసము జూపుకాడా
జిక్కులరక్కసులకీడ • శ్రీరఘురామా॥ 29

క॥ కొండాడెద నీపదములు
మండిత సత్కీర్తిపాంద్రి మాబాతకముల్
ఖండించి గట్టుఘంటము
జెండాడవె ప్రధనభీమ శ్రీరఘురామా॥30

క॥ రామాయని నినుదలచిన
యామనుజుల పాపమంత మఃగు నో హో నీ
నామ మహాత్మ్యము దెలియగ
శ్రీమంతా బ్రహ్మవశమ శ్రీరఘురామా 31

క॥ నీనామజపము ఘనులకు
మానస సంస్మరణవిద్య మఱి మోక్షశ్రే
యానందసుఖావహమ
శ్రీనాఘవినాశకంబు శ్రీరఘురామా॥ 32

క॥ కామిత ఫలదాయక నీ
నామమహామంత్రసిద్ధి నావంటిమహా
ధీమూఢులకు లభింపగ
క్షేమతోదయసేయుగదవె శ్రీరఘురామా॥

క॥ నీనామ యోగవిధిచే
నానాకృతికలుషసంఘ నాశకులగుచున్
దన్నారద వాల్మీకులు
శ్రీనాథా ధన్యులైరి శ్రీరఘురామా॥ 34

క॥ నీనామ మహామంత్రము
నానంద సనందసనక • డాదిమహర్షుల్
ధ్యానించి దన్మహాత్మ్యము
చే నిర్మల కీర్తులైరి • శ్రీరఘురామా॥ 35

క॥ చిరభక్త వరదనారద
వరసంగీతనిరత ముని • వాంఛితఫలదా
సుర వైరివీర విక్రమ
స్థిర ధైర్య ప్రథవిరామ• శ్రీరఘురామా॥ 36

క॥ దేవా! ననుగావ సరగ
రావా విలసత్ప్రభావ • రావణవిపినో
ద్దావా దీనుడ నే నీ
సేవాపరతంత్రుడనుర • శ్రీరఘురామా। 37

క॥ పతితజన పావనంబను
ఋతమగు నీమేటిబిరుదు•నిల్పుకొనుము రా
గ్రృతపాపుడ నజ్ఞానుడ
శృతవేద ప్రణవధామ• శ్రీరఘురామా॥ 38

క॥ భీమాఘకాష్ఠముల నీ
నామస్మరణాగ్ని హోత్ర • నవకీలలచే
వేమారు వ్రేల్చి బుచ్చెద
క్షేమంకర కరుణగనవె• శ్రీరఘురామా॥ 39

క॥ కావుము యోదేవానను
గావంగల వేల్పవీవ • గావునమఱినా
కీవేగతి నీపదరా
జీవమునే నమ్మినాడ • శ్రీరఘురామా॥ 40

క॥ నీవే గురుడవు దైవము
నీవే సారక్షకుడవు • నీవేసఖుడో
దేవా నీనామజపమె
జీవామృత ఫలమునాకు• శ్రీరఘురామా॥ 41

క॥ నీవే భూవ్యోమాకాశము
నీవే రవిచంద్రతార • నిగమమహాబ్ధుల్
నీవే దిగ్వననగముల్
నీవే సర్వంబు నిజము • శ్రీరఘురామా॥ 42

క॥ పరుడ నిక గాను సుమ్మీ
నిరతము నిన్గొలుచుచున్న • నీభృత్యుడనో
పరమాత్మా యోవరదా
స్థిరముగ నను గావుగావు• శ్రీరఘురామా॥ 43

క॥ ధరనీక్షణము నెగాదిక
శరణార్థుడనీదు నెపుడు • సర్వాత్మకయో
కరుణానిధి రక్షింపుము
చిరసౌఖ్యము బోసగినన్ను • శ్రీరఘురామా॥

క॥ సురవర గరుడోరగ కి
న్నర కింపురుషాబ్ధి సుత • నరగంధర్వో
త్కర గిరి శశితరణిశిఖ
స్థిరమగు నీశక్తి భళిర • శ్రీరఘురామా॥ 45

క॥ ఇహలోక సుఖమె సతమని
గృహపుత్ర ప్రమదతుచ్ఛ • విభవాన్వితులై
రహినిను దలపక మూఢు
స్స్పృహతో సద్గతికిదూరు • శ్రీరఘురామా॥ 46

క॥ శ్రీమానినీ మనఃప్రియ
కామా! భూమీంద్రసోమ • కలుష విరామా
ధీమనుజ వినుతనామా
శ్రీమద్వైకుంఠధామ • శ్రీరఘురామా॥ 47

క॥ భువనైక సార్వభౌమా
యవికల పుణ్యైకధామ • యరిజనభీమా
పరిమల మేఘశ్యామా
శివమౌని నుతాభిరామ • శ్రీరఘురామా॥ 48

క॥ సతత సుధీజనమాన్యా
ప్రతులిత సంపద్వదాన్య • యఘపరిశూన్యా
వితతిలసద్గుణధన్యా
క్షితికన్యా వినుతజన్య • శ్రీరఘురామా॥ 49

క॥ సంచిత సత్ప్రావీణ్యా
వంచితరాక్షసవరేణ్యా ♦ భక్తశరణ్యా
చంచత్సుగుణాగణ్యా
రింఛోళితభూరిపుణ్యా ♦ శ్రీరఘురామా॥ 50

క॥ లలిత సుధారస భాషున్
విలసిత సద్భవ్యవేషు ♦ విరహితదోషున్
పలలాశన విద్వేషున్
జెలువుగ కీర్తింతు నిన్ను ♦ శ్రీరఘురామా॥ 51

క॥ డుల్లుం బాపము నినుగన
జెల్లుందాపంబు లెదను ♦ శీఘ్రమె సం వ
ధిల్లుం జ్ఞానము తుద
రాజిల్లుం గైవల్యసుఖము ♦ శ్రీరఘురామా॥ 52

క॥ పరులకు గీడొనరించుచు
పరధనముల కాసపడుచు ♦ పాపస్థితి నీ
స్మరణ నెఱుంగమి మత్తుకు
చిరసౌఖ్యవిదూరుడగును ♦ శ్రీరఘురామా॥ 53

క॥ మంచగల వేల్పవంచును
వాంఛతొ నిన్వేడుచుంటి ♦ వరదా యికసన్
గొంచము సేయక దయర
క్షించగ భారంబు నీదె ♦ శ్రీరఘురామా॥ 54

క॥ నానేరము లెన్నకనను
సూనునియెడదల్లిమాడ్కి • జూడవె తండ్రీ
నేనన్యుడ గానుసుమీ
శ్రీనుతనీయాశ్రితుండ • శ్రీరఘురామా॥ 55

క॥ నాతప్పు సైపరాదా
తాతవునామీదనీకు • దయయేలేదా
నేతవాభక్తుడ గాదా
సీతావనితా వినోద • శ్రీరఘురామా॥ 56

క॥ జగతికపీంద్రుల తోడను
జగతీశుని తోడభక్త • జనములతోడన్
తగసేయువాడు ముందును
భృగురామాగ్రహవిరామ • శ్రీరఘురామా॥

క॥ సారకవిత్వ మహత్వము
సారజ్ఞుం డెఱుఁగుగాక • జడుడేమెఱుఁగున్
నీరజరస మీగెఱుగునె
జేటికహిందోళమెఱుగు • శ్రీరఘురామా॥ 58

క॥ తరుణి నపుంసకజననకు
విరసునకున్ వరసకవిత • వికృతునకువరో
వరలక్షణ శుభగత్వము
స్థిరముగవిఫలంబుగాదె • శ్రీరఘురామా॥ 59

క॥ రంభారతి సౌఖ్యస్థితి
జంభారియె యెఱుగునటుల • సరసమృదుకవి
తాంభోజముఖరసజ్ఞత
జృంభణముగ రసికుడెరుగు • శ్రీరఘు రామా॥

క॥ అధమునకు సుజనగోష్ఠియు
విధవకు సౌందర్యశోభ • విరసాత్మునకున్
సదమలకవితా బోధయు
వృధవంతముగాకజను నె • శ్రీరఘురామా॥ 61

॥ సుజనావన కామారిపు
విజయోత్సాహాభి రామ • విబుధస్తోమా
అజశివ లబ్ధక్షేమా
త్రిజగన్నుత భవ్యనామ • శ్రీరఘురామా॥ 62

॥ రాక్షసకులవనదాహా
పక్షిశ్రేణీంద్రవాహా • భావుకగేహా
రక్షితసుర సందోహా
శిక్షితరిపురాట్సమూహా • శ్రీ రఘురామా॥ 63

అతులిత చేతోమోదా
సతతాంతర్మ్యవినోద • సమ్యక్ శ్రీదా
శతమఖరిపునిర్భేదా
జితసోమకలబ్ధవేద • శ్రీరఘురామా॥ 64

క॥ నేరమెనావల నేమియు
భారమెనను బ్రోవనీకు • పరుషమి దేలా
ఘోరమె నిర్దయుడవగుట
జేరమెనీపదము కెఱగి • శ్రీరఘురామా॥ 65

క॥ కరివరు గాపాడితివని
గరుణతొ ప్రహ్లాదభక్తు • గాచితి వటంచున్
నరు నేలినాడ వనుచును
స్థిరముగ వినుఁ వేడుకొంటి • శ్రీరఘురామా॥ 66

క॥ కరిగాచుటొక్క బిరుదా
బోరిబోరి ప్రహ్లాదభక్తు • బ్రోచుటఘనమా
నరుదోడ్పడుటబులుతంబా
స్థిరముగ నన్నేలునిజము • శ్రీరఘురామా॥ 67

క॥ కరుణాలవాల మాధవ
వరదా గోవిందకృష్ణ • పాపవిదూరా
వరభక్తపాల కేశవ
స్థిరతరనారాయణాఖ్య • శ్రీరఘురామా॥ 68

క॥ నారాయణాయటంచును
గూర్రాత్ముడజామిళుండు • గొడుకుబి వనా
నారాయణాఖ్య శబ్దమె
జేరి చెపన్ముక్తిఁ బడ్డెర • శ్రీరఘురామా॥ 69

క॥ రామునివంటి మహాత్ముడు
రామునితో సాటివేల్పు ◆ రాముని కీడౌ
ధీమంతుడందు లేడని
బ్రేముడి సేజాట్లుచుందు ◆ శ్రీరఘురామా॥ 70
క॥ నాతండ్రి దీనరక్షక
సీతో సరివేల్పు వీవె ◆ నిక్కము నేనే
నాతో సరి దుష్కృతుడను
సీతాపతి నన్ను గావు ◆ శ్రీరఘురామా॥ 71
క॥ పరమేశ్వర పురుషోత్తమ
నరసాధ్యపురాణపురుష ◆ శౌరిముకుందా
మురహరణా నారాయణ
చిరపుణ్యగుణాభిరామ ◆ శ్రీరఘురామా॥ 72
క॥ వందనమిదిగో రాఘవ
వందనమిదె వాసుదేవ ◆ వందనము హరీ
వందనము నీకు కరుణా
సింధూ వందనము జేతు ◆ శ్రీరఘురామా॥ 73
క॥ వందనమిదె నారాయణ
వందనమిదె నారసింహ ◆ వందనమో గో
విందా వందనమిదియో
బృందావనచారకృష్ణ ◆ శ్రీరఘురామా॥ 74

క॥ కోపాన పతిశపింపగ
పాపిష్ఠియహల్యతొల్లి ♦ పాషాణంబై
నీపదము సోక నప్పటి
స్త్రీపాత్రతగాంచె భళిర ♦ శ్రీరఘురామా॥ 7

క॥ భజియింతు దైవరాయా
భజియించెద విశ్వరూప ♦ భజియింతునినున్
భజియింతు నీపదంబులు
ఋజుభావముతోడగనవె ♦ శ్రీరఘురామా

క॥ లంకంగాల్చి రిపుల ని
శ్శంకగావధియించి గాంచి ♦ జానకిదేవిఁ
గొంకకవచ్చె భళీ నీ
లెంకహనూమానబలుడు ♦ శ్రీరఘురామా।

క॥ నీ కృపగల్గినవారికి
నేకార్యములేనిశీఘ్రము ♦ మీడేరునోహో
నీకరుణకు బాత్రునిగా
జేకొనవేనన్ను దేవ ♦ శ్రీరఘురామా॥ 78

క॥ కోతుల మూకలుదోడుగ
సేతువుబంధించి శక్ర ♦ శిష్యులతోడన్
సీతాపహారి బురిగొని
సీతన్గొనివస్తివౌర ♦ శ్రీరఘురామా॥ 79

॥ నాదిక్కు నమ్మ లేదిక
నాదిక్కును రక్షణంబు • నాజుట్టమవున్
నా దైవమీ వెగానీ
శ్రీదయితా యన్య మెఱుంగ• శ్రీరఘురామా॥80

॥ శరణార్థి యగు విభీషణు
గరుణతో రక్షించి బంక్తి • కంధరుబోరన్
బరిమార్చి లంకకరరే
స్థిరముగ బట్టంబు గడితి • శ్రీరఘురామా॥

స్థిరమా కాంతాసుఖములు
స్థిరమా ధనధాన్య కనక • గృహసంపదలున్
స్థిరమా దార సుతాదులు
స్థిరమా యీ దేహమింక • శ్రీరఘురామా॥

స్థిరమా యీవిభవంబులు
స్థిరమా సంసారతుచ్ఛ • జీవనఫలముల్
స్థిర మగు నీపదభక్తియు
స్థిర మగు నీ నామభజన • శ్రీరఘురామా॥

శ్రీగల్గవత్తులగుచును
వేగమనిను దెలుసుకొనరు• వెడగులునొకకా
సీగియు నీయదలంపరు
సేగుల పాలగుదురవుడు• శ్రీరఘురామా॥ 9॥

క॥ హేమాచల సమధీరా
భూమీంద్ర ప్రణుతసార • పుణ్యాగారా
కామాదిగుణవిదూరా
శ్రీమదురివిజితసూర • శ్రీరఘురామా॥ 85

క॥ శీలాది గుణాసక్తా
పాలితయోగపరమభక్త • పాపవిముక్తా
లీలావినోదయుక్తా
శ్రీలలనా పరిణయవక్త • శ్రీరఘురామా॥ 86

క॥ దీక్షాపరతంత్రుడవై
కుక్షిలోబదునాల్గుభువన • కూటములొకటన్
రక్షించు దేవ నినుయమ
శిక్షలనుంగాక నేలు • శ్రీరఘురామా॥ 87

బంధురదీక్షా సీతా
సింధురగామిని సమేత • శ్రీరఘురామా॥ 88

క॥ మించిన రిపువర్గంబుల
[illegible] కోటి • [illegible]
డించితిం పాతకముల వా
రించితివే భవదీయకరుణ • శ్రీరఘురామా॥ 89

క॥ దుంచెద నాశాపాశము
గాంచెద నీపుణ్యపదము • గాలునిభటులన్
బంచెద బ్రియమున నను కూ
కూలించెద సద్భక్తవరుల • శ్రీరఘురామా॥

క॥ భద్రాచల వరగేహా
భద్రాచలనేత్రి మోహా • భక్తస్నేహా
క్షుద్రాసురతతిపుర్వాహా
చిద్రూపక పాహిపాహి • శ్రీరఘురామా॥

క॥ కౌరవులు నాడుసభలో
క్రూరాత్ములు ద్రుపదతనయ • గోకలు వొలువఁ
జీరలొసగి యాసాధ్విని
జేరికతో గాచితీవె • శ్రీరఘురామా॥ 92

క॥ మోదసమన్వితుఁడభవ
త్సోదరుఁడా లక్ష్మణుండు • సుస్థిరవిజయో
న్మాదుఁడు నీసముఁడధను
ర్వేదియునై గాలెభళిర • శ్రీరఘురామా॥ 93

క॥ నయమార శివిధ ఫలముల
భయభక్తిని నీకొసంగు • పావనశబరిన్
దయతో స్వర్గము జేర్చిన
ప్రియ దేవా దిక్కు నీవ • శ్రీరఘురామా॥ 94

క॥ సురుచిర సద్గుణధుర్యా
ధరణీభారైకవార్య ♦ దళితక్రౌర్యా
వరరుచిజితశత సూర్యా
స్థిరతర చలితారిధైర్య ♦ శ్రీరఘురామా॥95

క॥ భక్తినిను సంస్మరించుట
రక్తిని నీకథలవినుట ♦ రహినినుగనుటల్
భక్తాగ్రేసరులకు ని
ర్ణిక్తపుసద్వ్రతములివియె ♦ శ్రీరఘురామా॥96

క॥ వేదాపహారి యగుచును
పాథోనిధిజొచ్చుదనుజు ♦ మత్స్యస్ఫూర్తిన్
భేదించి యిచ్చితజునకు
శ్రీదములగు వేదములను ♦ శ్రీరఘురామా॥97

క॥ సురదనుజులు పడిమంథర
గిరిగొని సాంద్రంబుదరువ ♦ గ్రిందదిగ్రుంగన్
గరమనుగతికూర్మమవై
స్థిరధరమును నెత్తితౌర ♦ శ్రీరఘురామా॥98

క॥ ధారుణి జాపగ జుట్టుచు
బారెడు హేమాక్షదైత్యు ♦ బతితువరాహా
కారత యమపురికంపిన
శ్రీరమణుని నిన్స్మరింతు ♦ శ్రీరఘురామా॥99

క॥ సుజ్ఞానివైన బాలకు
నజ్ఞానతనిగ్రహించి • నట్టిసురారిన్
బ్రాజ్ఞత నరసింహుడవయి
జిజ్ఞాసవధించితీవె • శ్రీరఘురామా॥ 100

క॥ అదితికి గశ్యపునకు ప్రియ
మొదవుకుమారునిగవామ • నుండవునగుచున్
ఉదయించి బలినడంచితి
త్రిదశాలికి హితముగాగ • శ్రీరఘురామా॥

క॥ భూమిజమదగ్నికి పరశు
రాముడవైపుట్టి నృపుల • పరిహరించిమహా
ధీమతిగశ్యపునకు మహి
సేమంబున నొసగితౌర • శ్రీరఘురామా॥102

క॥ దశరథరాట్పుత్రుడవై
దశకంఠపముఖదుష్ట • దానవకోట్లన్
వెసగూల్చి విబుధవినుతు
ల్వేశదముగానందితీవె • శ్రీరఘురామా॥103

క॥ జిష్ణుడవై పాపహరిణ
నిష్ణాతుడవై జరించి • నెగడితిసద్వా
రిష్ణత బలరామాకృతి
గృష్ణుకు నీతమ్ముడవగ • శ్రీరఘురామా॥

క॥ క్రీలలర మజ్జగంబుల
స్త్రీలన్ బాధ్ధతవరించి • త్రిపురాసురులన్
గూలదహించెదు శివునకు
లీలమాయిందోడువైతి • శ్రీరఘురామా॥105

క॥ కేలనొక ఖడ్గమూనుచు
బోలగ కల్క్యవతార • మూర్తివియనగా
నేలితివి తురగమెక్కి సు
శీలతవర్ణములు వెలయ • శ్రీరఘురామా॥106

క॥ హేలోత్పాటిత శైలా
శీలోపేతార్యపాల • సీతాలోలా
నీలీల లెఱుగవశమె
శ్రీలలనా మణికినైన • శ్రీరఘురామా॥107

క॥ కపటుడను దుర్మదాంధుడ
జపశూన్యుడ నేరచించు శతకంబిదిగో
కృపఁగొని చిత్తగింపుము
నృపకులవర సార్వభౌమ • శ్రీరఘురామా॥

క॥ ఏమానవుడీ శతకము
నేమమున భతిఁచుభక్తి నిత్యంబును శ్రీ
రాము దయానుగ్రహమున
నా మనుజునకు ఘననా • మై సుఖమబ్బున్॥109

క॥ ప్రౌఢులకును బాలురకును
మూఢులకును సహిత మర్థ ◆ బోధ్యంబుగ
బ్రారూఢిదలంచి రచించితి,
గూఢార్థ మభేద్యమనుచు ◆ కోవిదులారా॥

క॥ తప్పులు గల్గిన దిద్దుడు
యొప్పులుగని దప్పులనుచు ◆ నూహింపకుడీ
యెప్పాటనైన గవనపు
దప్పులులేనట్టి కవులు ◆ ధారుణిగలరే॥

ఇది విశ్వబ్రాహ్మణులు కడియాం సత్యనారాయణ
కవిచే రచియింపఁబడిన శ్రీరఘురామశతకము



సంపూర్ణము.